**98**

# మల్లికార్జున శతకము



శ్రీ భ్రమరాంబామల్లికార్జునస్వామి నేనమః

# మల్లికార్జున శతకము



శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామి సేవకుఁడ!

# శ్రీ మల్లికార్జున శతకము

——::——

ఉ॥ శ్రీగిరిజావరాననని వ।సింపగ నర్ధశరీరమందునా
వాగధినేతముఖ్యసుర।వారము భక్తిభజింపభక్తర
క్షాగణనీయతత్పరత। గ్రాలెడు దైవతమాళి! శంకరా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా! 1

ఉ॥ ఈగతిఁ బెక్కుకష్టముల। నెల్లసహించిత్వదీయదర్శనం
బాగమవేద్య! కోరినడ।యాడుచు వచ్చితిఁ జేరదీసి నీ
బాగగు దివ్యరూపమున।పారదయం బాడఁజూపి కావవే
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 2

ఉ॥ భోగివిభూష! దివ్యదయ।పూజిత! భక్తజనార్తివారణా!
వేగమె కష్టముల దులిచి।విశ్రుతసౌఖ్యములిచ్చి యోదయా
సాగర! నన్నుసంసరణ।సాగరమగ్ను సముద్ధరించవే
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 3

ఉ॥ నాగవిభూష! రుద్రగణ।నాయక! శంకర! వేదవేద్య! నీ
లాగు కనుగొనందలచి।లక్ష్మిమనోవిభుడా విధాతయున్
వేగమెనీదు లింగమును।విస్మృతిఁ గాంచక వ్యర్థులైరిగా
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 4

ఉ॥ భోగిశయానమిత్ర! హర!।పుణ్యజనస్తుతిపాత్ర! శంకరా!
యోగతినామసంబువిల।సిల్లు భవత్పద భక్తియుక్తిచే?
వాగమృతప్రకల్పితస్త।వంబు లెటుల్ పచరింతు నిచ్చలున్?
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 5

ఉ॥ నాగశయానముఖ్య! సుర।నాయకవందిత! భక్తకల్పకా!
నాఁగతిఁగాంచిదుర్గుణగ।ణంబులవేఁదొలఁగించి భక్తికిన్
లోఁగఁగఁజేయునామనము।లోకచయప్రతిపాలనోద్యమా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 6

ఉ॥ రాగముఖాదిదుర్గుణప।రంపరలోమది తల్లడిల్లనా
నాఁగతులన్ భవాబ్ధిఁబడి। నాశముఁజెందెదు జీవసంతతుల్
వాగురఁజిక్కి చేడ్పడెడు। వన్యమృగంబులభాతిఁబిట్టుగా
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 7

ఉ॥ ఓగణనాధ! యోవరద! । యోగిజనస్తవనీయరూప! వి
ద్యాగణనీయతత్త్వ! విబు।ధాశ్రయ! భక్తజనార్తివారణా!
నాఁగతిఁగాంచవేల? నను।నాయముచేకొనకుంట? శంకరా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 8

ఉ॥ ఆగమశాస్త్రముల్ చదివి । నంతనె నీకమనీయరూపమున్
వేగమెకన్గొనంగలుగు । విశ్రుతపాండితికల్గునయ్య? నీ
వేగతియంచుమానసము । పీకభవత్పదమందు నిల్పకే
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 9

ఉ॥ ఓగునవేఁదొలంచి సుఖ।యోగముఁ దాఁగలిగించునట్టి వీ
లేఁగతిఁగల్గునంచు నరు।డెంతయుకోర్కిని కార్యజాలమున్
వేగమెచేసియున్ తుదకు । వేసరికర్మముజాడలెన్నుగా
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 10

ఉ॥ రాగముతాళమున్ గలపి । రమ్యగతిన్ భవదీయకీర్తనల్
వేగమెపాడజాల, నది । వేడ్కనొసంగదు కాన, మానసం
బో గజచర్మధారి! నిను।నొప్పగ సంస్తుతిఁజేతునిత్యమున్
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 11

ఉ॥ రోగము దేహమందునికి। రూక్షముగాఁ దపియింపఁజేసె, నా
నాగతులన్ శరీరబల । నాశము తార్కొనె, మృత్యుభీతిచే
వేగమె మానసంబడలె, । భీతిఁ దొలంచి సముద్ధరింపవే
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 12

ఉ॥ రాగలకష్టముల్ గని ప।రాకును చెందెను మానసంబు నే
నేగతిఁ దీనిసంచలన।నిష్ఠితధర్మము వేఁనొలంచి త్వ
ద్యోగము గూర్పజాలుదు, న।యాననుఁ గాంచు కృపార్ద్రదృష్టితో
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 13

ఉ॥ రాగము నన్ను వీడదు, వి।రాగము గల్గఁబోదు సుంతయున్
భోగమునందు కాంక్ష విడఁ।బోదు, నికే విధి నిన్నుఁ గొల్వఁగా
రాగలనయ్య? శంకర! ని।రాకృతుఁ జేయక నన్ను కావుమో.
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 14

ఉ॥ వాగురఁ జిక్కి చేడ్పడెడు । వన్యమృగంబుల రీతి మానవుల్
రాగము క్రోధమున్ మదము। రాజిలు లోభము మత్సరంబు నా
నాగతులన్ గలంపఁబడి । నాశముఁ జెందుదు రీభవాబ్ధిలో
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 15

ఉ॥ నాగగణేశుడున్ విబుధ । నాథుడు నీ మహనీయ వర్ణనం
బేగతి నేని చేయుటకు । నెంతయుఁ జాలరటన్న నల్పుడన్
కాగల నే సమర్థుడను । కంజవిలోచనమిత్ర! శంకరా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 16

ఉ॥ ఆగుము మానసాబ్జమున, । నంకిలి సేయకు, కట్టివైచెదన్
బాగుగ భక్తిరజ్జువున । పార్వతిమానసపద్మషట్పదా
నాగగణేశభూష! నిను । నవ్యమృదూక్తుల సంస్తుతింతునో
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధపా. 17

ఉ॥ ఆగకపోవగానగునె? । అంబికనాయక! నామనంబునిఁ
లోఁగొనియిట్టటుల్ చనక । లోలతఁ జెందునిరంతరంబు నా
యోగముమాన్పనీకగునె? । యొప్పులకుప్ప! దయాబ్ధి! శంకరా!
శ్రీగిరిమల్లికార్జున! వి । చిత్రవిలాస! నగాత్మజాధిపా. 18

ఉ॥ ఆగడమామదీయమగుఁ । నాశయముఁ గమనింపరాద, నీ
భోగముఁగోరితో? పదవి । పోలగఁ గోరితొ? శక్తిఁగోరితో
నాగవిభూష! పాతక । వినాశము వేపొనరించి కావవే
శ్రీగిరిమల్లికార్జున! వి । చిత్రవిలాస! నగాత్మజాధిపా. 19

ఉ॥ ఆగదుమానసంబు, భవ । దంఘ్రులనిల్పి నిరంతరంబు సే
వాగతకింకరత్వమున । హారిగసల్పగఁ గోరుచుంటి ది
వ్యాగతవైభవోన్నత! వి । యామకసుంబొనరించి కావవే
శ్రీగిరిమల్లికార్జున! వి । చిత్రవిలాస! నగాత్మజాధిపా. 20

ఉ॥ ఆగమవేద్య! నామనవు । లన్నిటిఁ గైకొని బాలుకైవడిన్
వేగమెనన్నుగాంచి శుభ । వీక్షణముల్ బరగించి బ్రోవవే
వాగధినేతముఖ్య సుర । వందిత సచ్చరణాబ్జ! శంకరా!
శ్రీగిరిమల్లికార్జున! వి । చిత్రవిలాస! నగాత్మజాధిపా. 21

ఉ॥ శ్రీగిరిఁజూచువేడ్కఁబలు । చిక్కులఁబాల్పడిభక్తిభావముల్
లోఁగొనగుట్టమిట్టల గ । డుంగడుసోలుచు చేరలేక నా
నాగతులందపించెద ర । నారతముంగడుయాత్రికాళియో
శ్రీగిరిమల్లికార్జున! వి । చిత్రవిలాస! నగాత్మజాధిపా. 22

ఉ॥ బాగుగయోచనల్సలుప । భంగముపాలగుజీవనంబు ని
త్యాగతకష్టభాజనము । నాగదయీ బ్రతుకంచుఁగాన కే
లాగుననర్థసంగ్రహణ । లాభముకై మదినెంచుమూఢుఁడో
శ్రీగిరిమల్లికార్జున! వి । చిత్రవిలాస! నగాత్మజాధిపా. 23

ఉ॥ బాగని యెంచి సంసరణ । బంధములోఁ బడిఁ జిక్కి సోలుచున్
వేగ బయల్పడంగనగు । విద్య నెఱుంగదు మూఢచిత్తుఁడే
లాగు భవత్పదాంబుజ వి।డంబితభక్తిఁ గనంగ నేర్చునో
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 24

ఉ॥ రాగి సువర్ణమౌనె? సుక।రంబుగ వాదవిధం బెఱుంగ కే
నాగతి మూఢమానవుఁడ । నన్యమృదూక్తుల నీగుణాలిదా
బాగుగ సంస్తుతుల్ నెరపి । ప్రాభవమందునె? జ్ఞానిగాకనో
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 25

ఉ॥ భోగముఁ గోరి మానసము । పోదు విరక్తిసమాశ్రయింప, దే
హాగతయింద్రియాళి కడు । హోవడిఁ గూర్చు నిరంతరంబు, నే
నే గతి వీని బంధముల । నీడ్చి చరించగ శక్తిఁ గాంతునో
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 26

ఉ॥ మూగకు వాక్యపద్ధతియు । మూర్ఖునకున్ రసభావదీపనం
బేగతిఁ గల్గు? నట్టులె ర।మేశసఖా! భవదీయభక్తి దు
ర్భాగునకబ్బునెట్లు? నిర।పాయలసత్సుకృతంబు కల్గకే
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 27

ఉ॥ మూగయు రాగయున్న రయమూర్ఖుడు పండితుఁడౌ క్రయాపెకా
నీగణనీయభక్తిఁ గన । నేరని మానవమాత్రులెల్ల నిం
దాగతికిన్నిదానముగ। దాకడు భక్తివిహీనుడెంతయున్
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 28

ఉ॥ మూగయు మూగయౌనె పర।మోత్తమభక్తివిశేషమబ్బినన్
దాగణనీయుఁడౌ జగతిఁ । దజ్ఞసమూహములోన నిచ్చలున్
వాగమితప్రసక్తిఁ గని । భక్తి నెఱుంగనివానికన్ననో
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 29

ఉ॥ వాగురలందవులోఁ—నిన । వన్యమృగంబులరీతినింద్రియా
ద్యాగతబంధనాళిఁబడి । యందుబయల్పడఁజాలకెంతయుఁ
లోగమనంబుడిల్పడు వి।లోలతమావనమాఁ త్రుడిచ్చులున్
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 30

ఉ॥ యోగిజనైకగమ్య! నిల।యోచితరాజితశైలరమ్య! వి
ద్యాగణనీయసామ్య! పర।తత్వలసత్సుజనేష్టకామ్య! దే
వాగసమప్రకామ్య! నిరు।పాధికచిత్సుఖగమ్య! శంకరా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 31

ఉ॥ యోగిజనాత్మకంజనిల।యోచితషట్పద! సర్వమంగళా
భోగవిధాయి! లోకచయ।పూజిత! చిన్మయరూప! శంకరా!
నాగవిభూష! దేవముని । నవ్యగుణస్తుతిపాత్రవైభవా!
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 32

ఉ॥ యోగిజనాత్మనిష్ఠితని।జోచితదివ్యస్వరూప! రాజతా
ద్యాగతసింహపీఠనిల।యా! గిరిజాధికమానసప్రియా!
నాగతిఁగాంచిదీనతను । నాశమొనర్చికృతార్థుఁజేయవే
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 33

ఉ॥ వాగధినేతముఖ్యసుర।వారసమర్చితపాదపంకజా!
శ్రీగిరిజామనోంబుజవి।చిత్రలసద్భ్రమరైకరూప! న
న్నేగతిఁగాంచిబ్రోచెదవొ।ఎంతయుఁగోరి—భజించినాడనో
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 34

ఉ॥ నాగచయేశభూషణ! స।నందనముఖ్యమునీంద్రసన్నుతా
ప్రాగధినాథయుక్తసుర । పాళిలసత్క—మనీయనాట్య! వి
ద్యాగణనీయయోగిహృద।యాంబుజనిత్యనివాస! శంకరా
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 35

ఉ॥ శ్రీగిరి శ్రీగిరీయనుచుఁ । జిత్తమునందలపోసినంతనే
వేగమెపాతకాళికడు । విచ్చితొలంగుత్వదీయదర్శనం
బోగులమాన్పుసర్వశుభ। యోగమొసంగునుమానవాళికిఁ
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 36

ఉ॥ త్యాగముసర్వకర్మలన। ధఃకరణంబొనరించిమించునా
త్యాగినిపోలడేనరుఁడు । దైవతవైభవమమృతత్వముఁ
జేఁగొనునంచుఁదెల్పుశ్రుతి।శ్రేష్ఠమె త్యాగమునాకొసంగవే
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 37

ఉ॥ త్యాగముభోగముంగలుగ।ధన్యమునౌ,ధనమెంతకల్గియుఁ
త్యాగములేనియాధనము।దంధనమేయగు మర్త్యకోటికిన్
త్యాగములేనిమూఢునకు । దర్శనభాగ్యమె,గుప్తిదుఃఖమే
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 38

ఉ॥ త్యాగగుణంబునన్మనుప్ర।ధాతనయుండగుకర్ణుడెంతయుఁ
లోగొనెకీర్తినాశిబియు । నూనపదంబునుఁగాంచెనెందరో
ప్రాగవనీశులెంతయును । భవ్యయశంబునుగాంచిమించరే
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 39

ఉ॥ త్యాగమెసర్వసద్గుణని।దానము, ఉత్తమలోకప్రాప్తికిం
దాగణనీయసాధనము । నావిలసిల్లునుసర్వలోకముఁ
త్యాగముఁగాంచిపెంపెసగి।ధన్యతఁగాంచునుత్యాగమూర్తివౌ
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 40

ఉ॥ ఓగజదైత్యగర్వవిల। యోచితవీరరసోచితక్రియో
ద్యోగనిరస్తదానవత। యోగ్రతమఃపటలీవిభాకరా!
యోగిశరణ్య! భక్తనివ। హాహ్లాదరసైకవిలాస! శంకరా
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 41

ఉ॥ నాగురుమూర్తి లోకచయ । నాశజనిప్రవిలాసకర్తృతా
దాగ్యగణనీయకార్యములఁ । దర్పకవైరివిధాతవిష్ణునా
మాగతమూర్తులంగని వి।హారమొనర్చెదు దేవదేవ యో!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 42

ఉ॥ ఈగ మొదల్కఁ గరీంద్రమును । నేర్పడగా భవదీయ తేజమున్
లోఁగొనివెల్గు, కానియెడ । లూనతఁజెందు, విచిత్రవైఖరుల్
సాగునె జంతుకోటికివి।లాసము లేక జగంబునందునో
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 43

ఉ॥ ఈగయదెంత? దానగల।యీశ్వర తేజమదెంత? చూడగా
నీగతిచోద్యమైతనరు । నీవిలసజ్జగమందు సర్వజీ
వాగత తేజమొక్కటిగ। నైచను తత్త్వవిచారమొప్పినఁ
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 44

ఉ॥ లేగనుగాంచి గోవుమితి।లేనిదయారసమొల్కఁగూర్మిచే
లోఁగొని దుగ్ధమిచ్చియెడ । లొప్పుగ నాకుచు బుజ్జగించునా
లాగుననన్ను, జేకొని ఫ।లప్రదమౌ పదభక్తిఁ గూర్పవే
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 45

ఉ॥ నాగతిమానసంబునను।నాటదొ, నిత్యము నీదుకీర్తనం
బాగకచేయుచుంటికరు।ణాంచితదృక్కులఁ జూపవేల? నా
బాగుకనుంగొనం దలపు। బారదొ? కర్మము నాశమొందదో?
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 46

ఉ॥ నాగశయానమిత్ర! గిరి।నాథ తనూద్భవకంజమిత్ర! సే
వాగతదివ్యమానినివ।హాంచితసత్తుతిపాత్ర! రాక్షసో
ద్వేగవినాశహేతుకర।వేత్ర! విభాసితఫాలనేత్ర! యో
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 47

ఉ॥ నాగవిభూష!భక్తగణ । నాయకపోషగిరీంద్రకన్యకా!
భోగకృదాత్మవేష!సుర । పుంజసమర్పితదివ్యభాష యో
యోగిజనాత్మతోష! విల। యోచితభావజవేష! శంకరా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 48

ఉ॥ నాగసురారిభంగ!కరు । ణారసపూరనిజాంతరంగ! పు
న్నాగసుమావళీమిళిత । నవ్యజటాలసదుత్తమాంగ ! నా
నాగమకోటివర్ణితసు । భాస్వదదివ్యనిజాంగ! శంకరా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 49

ఉ॥ ఓగరుడధ్వజాది సుమ । నోగణకీర్తిత నిత్యవైభవా!
యోగిజనాత్మసంతమస । నోదనదక్షదివాకరోదయా!
భోగివిభూషణాత్తరుచి । పూరితసర్వదిగంతవిస్తరా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 50

ఉ॥ నాగతిఁగాంచవే ప్రమథ । నాయక!నందిగణేశ శారద
ప్రాగభివంద్యసచ్చరణ । పంకజషట్పదరూపప్రాప్తిసో
ద్యోగనిరస్తపాపచయ । తోషణ! భక్తజనైకపోషణా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 51

ఉ॥ నాగతిసీవెఱుంగుమది । నమ్మితిపూర్వభవంబులందు నే
నేగతిఁ నెన్ని పాపములఁ । నేర్పడఁజేసితొ మూర్ఖతన్ మహా
భాగ!త్వదీయసత్కరుణ: । బాపిభవాబ్ధిఁదరింపఁజేయవే
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 52

ఉ॥ నాగతినేనెఱుంగుదున । నవ్యతరప్రతిభావిలాస వి
ద్యాగణనీయమాప్రకృతి । తంత్రమునన్ వడిఁజిక్కిసంత తా
భాగ్యగతకర్మముల్ సలుపఁ।నయ్యెదుమూఢుడనష్టచిత్తుడన్
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 53

ఉ॥ నాగతిఁ గాంచి మానసము । నందున కారుణికత్వమూని నా
యాగతకర్మసంచయము । నంత మొనర్చి విరాగితా విలా
సాగతజ్ఞానలేశము ని। రంతరతత్త్వప్రదభక్తిఁ గూర్పవో
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 54

ఉ॥ నీగతి నీదె, నేను గమ । నించన టంచు వచింతు వేమొ, యా
లాగు తలంచఁ బోకు, పది । లంబుగ మానసపంజరంబునన్
వేగమె కట్టివైతు నిక । వీడను, నన్నటు బాసిపోమొదో
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 55

ఉ॥ నాగురు పెన్నిధానమ! స । నాతన! కారణకార్యకల్పనో
ద్యోగవిధాప్రకల్పితని । జోచితవేష! నిరస్తదోష! దై
త్యాగనిరంతరోన్మథన । దక్ష! నమజ్జనరక్ష! శంకరా!
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 56

ఉ॥ నాగురుదేవ! హైమవతి । నాయక! భక్తజనేష్టదాయకా!
నాగసురారిదోర్బలవి । నాశనహేతుపరాక్రమక్రమా!
యోగిజనాత్మమందిరని । జోచితవాస! ఉమావిలాస! యో
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 57

ఉ॥ భాగవతప్రచారపరి । పంథిదురాత్మకరాక్షసౌఘనా
శా! గణనీయభక్తివిల సన్మునిమానససన్నివేశ! నా
నాగమశాస్త్రదీపితమ । హాత్తరకార్యవిశేష శంకరా!
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 58

ఉ॥ భాగవతాత్మమందిరవి । భాసిత! సజ్జనమానసాంబుజ
ప్రాగభివర్ధితప్రథిత । భాస్కరరూప! దయాస్వరూప! నా
నాగణనీయజీవనిచ । యామరభూజ! హరన్మనోజ! యో
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 59

ఉ॥ భాగవతాదిశాస్త్రచయ । ఫక్కిఁ గనుంగొన నీవిలాసమే
బాగుగఁ గోచరించు నిను । బాసి రహించెడి విద్య గారడీ
కాగలదంచుఁ దోచు భుజ । గాధిపభూషణ! భక్తితోషణా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 60

ఉ॥ లోగకపాపచింతనకు । లోలత నొంద, కనాదు మానసం
బాగణనీయభక్తికన । యంబును పొందొనరించినాడనా
రాగముఖాదిదుర్గుణవి । రామము వేపొనరించి కావవే
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 61

ఉ॥ భాగనిరాకృతక్రమస । వప్రతిపాదను దక్షుశిక్షకై
వేగమె వీరభద్రు నొక । వీక్షణమాత్రనె సృష్టిఁ జేసి త
ద్భాగవిహీనమౌ సవము । భగ్నముగా నొనరింపఁ జేసితో
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 62

ఉ॥ భూగగనానిలాగ్నిజల । భూతగణంబును రూపొనర్చి త
ద్భాగవిశేషసంఘటన । పద్ధతి జీవులనంతకోటులా
లాగున సృష్టిఁ జేసినవి । లాసము నెన్నఁ దరంబె! శంకరా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 63

ఉ॥ భూగగనానిలాగ్నిజల । పూరితవిశ్వము సర్వముం మహా
భాగ! త్వదీయతేజమున । భవ్యతఁ గాంచి వెలుంగు లేనిచో
వేగమె రూపఱుం దితిజ । భేదనదక్ష! దయాసమీక్షమో
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 64

ఉ॥ భూగతప్రాణిసంఘములు । పొల్పు రహించుట వృద్ధిఁ గాంచుటల్
బాగతి రూపుమాయుటవి । లాసము నీకగు లోకనాటకం
బీగతిఁ జెన్ను మీరుటకుఁ । బ్రీతి వహించెదు నర్తకాగ్రణీ!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 65

ఉ॥ భోగమునాశముంగలుగు । పోలగసంతతజీవకోటికిఁ
బాగునుకాంచిపెంపుఁగను। భాగ్యముకైతపియించులోకమీ
లాగుఁగనంగశక్యమెవి । లాసితసత్కృపనీవుచూడకే
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 66

ఉ॥ భోగమువీడిపున్కలను । పూని విరాగముఁగాంచిశక్తులన్
లోగొనిసర్వభూతముల । లోలతపాలనముంబొనర్చునా
యోగమెనిత్యమైతనర। యోగిమనోంబుజవాసమొందుదో
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 67

ఉ॥ భోగివిభూష! దాసజన । పోష!గిరీశకుమారకాగ్రణీ
యోగితదివ్యవేష! సర ।సోచితప్రోల్లసదాత్మభావ!వి
ద్యాగణనీయభక్తనిచ। యాధికతోష! మహేశ! శంకరా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 68

ఉ॥ ఓగజశీర్షషణ్ముఖమ ।హోత్సుకకారణభావ! పార్వతీ
యోగనిరంతరప్రథిత ।యుక్తసువేష!దివౌకసావళీ
భోగవినాశహేతుదితి । పుత్రవిదారణ!లోకకారణా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 69

ఉ॥ ఓగజచర్మధారణని ।జోచితవేష!సుభక్తపోష! ధై
ర్యాగ! హిమాద్రికన్యకని। రంతరతోష! నిజార్థతత్త్వవి
ద్యాగణనీయభావ! జగ । దండసుపాలన! భక్తఖేలనా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 70

ఉ॥ ఓగరుడాధిరూఢకరు। ణోల్లసదాత్మస్వభావ!నిత్యస
త్యా!గణనాథరక్షణవి।ధాపరిశోషితసుప్రభావనా
నాగమశాస్త్రసంస్తుతప ।రాపరవిద్యకృదాత్మభావయో!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 71

ఉ॥ రాగమయప్రపంచమును । రంతరముల్ వెలయింపఁజేసిని
త్యాగతకష్టకారణము । నైతపియింపవిలాసమాత్రమా
నీగతిజీవకోటివిల । సిల్లఁగఁజేయుదువేల? శంకరా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 72

ఉ॥ రాగముబాధహేతువని । రాగముముక్తికికారణంబు నా
భోగవివర్జితుండగుచు । పూజ్యతఁగాంచునుమానవుండు తా
నేగతినేనినీపదవి । నిర్మలభక్తిసమాశ్రయించినన్
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 73

ఉ॥ పూగమునాగవల్లిదళ । పుంజముకర్పూరముకూడినంతనే
రాగముఁగాంచిసేవకని । రంతరసౌఖ్యవిధాయియౌనటుల్
బాగుగమానవుండుగుణ । పాళినికూడినరాగమొందుగా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస ! నగాత్మజాధిపా. 74

ఉ॥ రోగమ్ములాశ్రయించితను।బాధఁదొలంచి కలంచివైచుచో
లోఁగడునాత్మదోషముని । లోలతచేఁదపియింపఁజేయుచో
వేగమెయామృత్యుభృత్యసుఖ । భీతిగలంచఁదలంచ నేర్తునే
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా 75

రోగసమావృతుండగుచు।నొప్పకమున్నమనంబుస్వాస్థ్యముల్
వీగకమున్నెనీచరణ । విశ్రుతభక్తిసమాశ్రయించినన్
బాగుగమానసాంబుజము । పట్టుగనిల్పిభజింతుభక్తితో
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 76

ఉ॥ రోగులుభోగులున్ తనువు।బాధము, శాశ్వతమంచుపుత్రదా
రాగతకష్టనష్టముల । నంతముఁలైతపియింపఁజేయగా
నీగఁగఁజాలకెంతొదుర । పిల్లెదరిచ్చలునిన్నుఁగానకే
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 77

ఉ॥ శ్రీగిరివాస మొందితివి । చిన్మయరూప! పరేశ! శంకరా!
శ్రీగిరిజామనోంబుజవి । శేషలసద్భుమ రైకరూప! యో
శ్రీగిరినాథధన్వి! విర । చింతుభవద్విలసత్కథాకృతుల్
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 78

ఉ॥ నాగవిభూషపాతకవి । నాశము వేహానగించి బ్రోవగా
నేఁగణుతింతునీకథల । నెంతయుభక్తిని చిత్తగించినిం
దాగతిఁ బాల్పడంజనని । ధన్యచరిత్రునిఁ జేసికావవే
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 79

ఉ॥ నాగవిభూష! యోగిజన । నందితవేష! మహేశ! శంకరా!
నాగతిఁ గాంచికష్టముల । నాశమొనర్చిదయాతిరేకముల్
వేగమెజూపికావవెక । విప్రజనందిత! భక్తవందితా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 80

ఉ॥ రాగముఖాదిదుర్గుణవి । రామముఁ గానక మానసంబుదే
హాగతయింద్రియార్థముల । నాపగలేక నిరంతరంబుఁ దా
వేఁగుచునీపదాబ్జయుగ । విశ్రుతభక్తిసమాశ్రయించదో
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 81

ఉ॥ రాగముకారణంబుగని । రంతరముల్ కడగండ్లఁ జిక్కి యీ
భూగతమానవప్రతతి । పొక్కుచునుండుటఁ గాంచియొక్కఁడే
నాగతిఁ బాల్పడంజనని । యచ్యుతభక్తిసమాశ్రయించడో.
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 82

ఉ॥ రాగమెజన్మసార్థకత । రాజిలఁ జేయునటంచు రావణుం
డాగక సర్వలోకముల । నాచికొనందలపూని దేవతా
పూగముమర్త్యకోటిగడుఁ । బొక్కఁగఁ జేసినశించె,నింతెకా
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 83

ఉ॥ రాగముపూని కౌరవధ । రాధిపుడైనసుయోధనుండుదు
ర్యోగముపాలు చేసిపలు । రూపుల బాధలోనర్చినామహా
భాగులఁ బాండవాత్మజులఁ । భండనమందునశించిపోవడే
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 84

ఉ॥ రాగముపూని కైకగుణ । రాజితురామునికాననంబులో
నేగగ, స్వీయపుత్రునవ । నీశ్వరుఁగాగవరద్వయంబుఁస
ద్యోగతిఁబొందిలోకమున । నొప్పునిదానపకీర్తిఁబొల్పడే
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 85

ఉ॥ సోగకనుల్ మెరుంగునును । చూడ్కులనీనగమేనికాంతులా
తీగె మెఱుంగులట్లగవిసి । దిద్దతిరంబుగనొప్పుమోహినిన్
వేగమెకాంచిమానసిక । విభ్రమమొందితిగాదెశంకరా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 86

ఉ॥ ఈగతినీవువిష్ణుపర । మేష్ఠిముఖామరజాతమెల్లమా
యాగతవిభ్రమాదులకు । నాశ్రయమొందినమర్త్యకోటితా
మేగతియీప్రపంచమున । నెంచగఁజాలు,మహేశ శంకరా!
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 87

ఉ॥ భూగతప్రాణిసంచయము । పుణ్యముపాపములేఫలంబులై
లోగొనుకర్మజాలమున । లోలతఁజెందినిరంతరంబుగా
వేగెదరీభవాబ్ధిఁబడి । వీడ్వడఁజాలకనిన్నుగానరో
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 88

ఉ॥ మాగినమావిపండతిను । మానవులెల్లసుఖంబుదుఃఖమున్
వేగమెకాంచులీలపృథి । వీతలమందలిజీవజాలము
లాగనునాత్మకర్మఫల । లాభముఁదప్పిచనంగనౌనె యో
శ్రీగిరిమల్లికార్జున! వి।చిత్రవిలాస! నగాత్మజాధిపా. 89

మూగయనంగనౌనెగుణ! పూజ్యుడుమానముఁదాల్చియోగిగా
రాగయనంగనౌనెజన । రంజనకార్యమునన్ సభాస్థలిన్
వేగనుపన్యసించుటకుఁ । బేర్చునతుచ్ఛభవదీయభక్తిచే
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. .0

ఉ॥ ప్రోగునుగంటసంతతము । ముందరమానిసితట్టినంతనే
వాగునుకోకిలంబుపసి । బాలురుకూతలిడంగనల్లియా
భూగతప్రాణులెల్లపర । బుద్ధిఁజనందమకింతురెంతయున్
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 91

ఉ॥ కాగడయునిక్కలాభమొస । గంజనునేరవిదీప్తికల్గుచో
నాగమశాస్త్రపాండితిగ । నంబనికల్గునెక్షుద్రవిద్యతో
రోగముకల్గభోజనము । యూషిగలాభమొసంగనేర్చునే
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 92

ఉ॥ కాగడజేతఁబూనివెత । కంజనునేతనచేతికంకణం
శాగతిస్వీదయకర్మముల । నయ్యెడునాపదలంగనంగలే
కీగతికింబరాప్రకృతి । యేతగుకారణమంచుఁబల్కునో
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 93

ఉ॥ కాగడసాధనంబగును । గాదెతలంపగఁ బాటసారికిన్
బాగుగశాస్త్రజన్యమగు । పాండితినెంతయునూతకోలగా
దాగడుదుస్తరంబగుట । దాటగనేర్చుభవాబ్ధిమగ్నుఁడో!
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 94

ఉ॥ కాగలకార్యముల్ తమకు । గాకృషిలేకనెపూర్తిగాంచునం
తేఁగడుయత్నముల్సలిపె । నేనియుఁతాఫలియింపఁబోవునే
నీగతిఁగాంచసర్వమును । హేశ్వర! నీదగులీలకాదెయో
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 95

ఉ. భోగవిదూర! లోకచయ। పోషణదీపితసర్వభార! వి
ద్యాగణనీయయోగిహృద। యాంబుజమిత్రలసత్ప్రచార! నా
నాగమశాస్త్రసన్నుతవి। హార! దయామృతపూర! శంకరా
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 96

ఉ. నాగతురంగచేలమర। నాయక!భక్తవరప్రదాయకా!
భోగిశయాననాయక! అ। పూర్వదయారసనంప్రదాయకా
స్వాగతముఖ్యపూజనము। భక్తినొసర్చెదనంగకోనంగదే
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 97

ఉ. భాగవతోత్తమప్రథిత। భావనిరంతరలక్ష్యమాణరూ
పా!గజవైరిసంహరణ। భవ్యపరాక్రమదీప! దేవతా
పూగనిరంతరార్చితత। పోనియమాధికసుస్వరూప!యో
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 98

ఉ. నాగగణేశభూష! సుర। నాయకసన్నుతవేష!పార్వతీ
భోగకృతాత్మతోష!సుర। పుంజసమర్చితదివ్యభాష! నే
త్రాగతవహ్నిసంతపిత। దర్పకరోష! గణేశపోష!యో
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 99

ఉ. నాగశయానమిత్ర!గణ। నాథముఖస్తుతిపాత్ర!భక్తసం
యోగనిరంతరాత్మనిల। యోచితమాత్ర।మనోజమారణో
ద్యోగవిలాసకల్పనప్ర। యుక్తసునేత్ర!కపాలపాత్ర!యో
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 100

ఉ. స్వాగతమద్రిజాహృదయ। సారసమిత్ర!ఉమేశ!అర్ఘ్యమో
యోగిశరణ్య!పాద్యమిదె। యోహర!యీమధుపర్కమంబికా
భోగవిధాయి!వస్త్రమిదె। పుణ్యజనప్రియ! పార్వతీపతీ!
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 101

ఉ॥ భోగవిభూష! గంధమిదె। పూజితపాద! సుపుష్పమాలికా
యోగమిదేసురారివిల। యోగ్రపరాక్రమ! ధూపమియ్యదే
గోగణనాథవాహ! యిదె। గోకొనుదీపముఫాలనేత్ర! యో
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 102

ఉ॥ ఓగజదైత్యసంహరణ। యోగనిరంతరసజ్యమానచా
పాగతభీకరధ్వనివి। పాటితదానవశీరధావనో
ద్యోగనిరస్తశత్రురుచి। ధూతవిభాకరదీప్తిమండలా!
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 103

ఉ॥ ఓగిరిశా! నివేదనము। నొప్పఁగఁగైకొనుషడ్రసప్లుతం
బైగురుభక్ష్యభోజ్యయుత। మైవిలసిల్లెడుస్వర్ణపాత్రమం
దేగశుభక్తినర్పణము। నేనొనరించితిపార్వతీప్రియా!
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 104

ఉ॥ వేగమెతాంబులంబుఁగొను। విశ్రుతభక్తినొసంగినాడచే
సోగత! మంత్రపుష్పమిదె। ధూర్జటి! దక్షిణయుక్ప్రదక్షిణం
బాగతిచేనమస్కృతియు। మాంచితదేహ! మహాప్రభావ! యో
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 105

ఉ॥ ఓగిరికన్యకారమణ! । యోత్రిపురాసురమర్దనక్రియా!
యోగణనాధసంతతసు। ఖోదయదాయక! విఘ్నపాయకా!
యోగిజనప్రపూజిత! మ। దోద్ధతదైత్యబలప్రభంజనా!
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 106

ఉ॥ వేగమెనీస్వరూపమును। వీక్షణపాత్రమొనర్చికావగా
రాగదెభక్తమానసని। రంతరవాస! దయావిభాస! నీ
వేగతియంచునమ్మితిమి। మహేశ్వరితోషణ! నాగభూషణా!
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 197

ఉ॥ నేఁగడుభక్తిఁగూర్చితిన। నిందితభక్తినిసుత్పలాఖ్యచే
బాగగుమాలికామణుల। భవ్యవిలాస! జగన్నివాస! కై
కోఁగదెయార్త సంచయసు। ఖ్యోచితమానస!దర్పకాంతకా
శ్రీగిరిమల్లికార్జున! వి। చిత్రవిలాస! నగాత్మజాధిపా. 108

ఉ॥ యల్లయప్రగ్గడాఖ్యుఁదగు।నయ్యమదీయగృహాఖ్యధాత్రిలో
జెల్లెదసుబ్బరావనగ। శ్రీపురవాసిఁద్వదీయభక్తుఁడ౯
కొల్లలుగాదయారసము। గుప్పినసుంగరుణాకటాక్షముల్
మొల్లముగారహింపఁగను। మోకరుణాకర! పార్వతీప్రియా!

—: — హరిః ఓం - తత్సత్ —: —

# అభిజ్ఞుల కొక విజ్ఞప్తి

అనంతకల్యాణగుణ విశిష్టుండగు శ్రీరామచంద్ర మూర్తి వారి యనుగ్రహ విశేషంబునను జన్మాంతరకృత సుకృత బలంబునను కలిగిన కవితాశక్తి సార్థకంబుగ శ్రీరామసేవా గ్రంథమాల యను పేరం గొన్ని గ్రంథముల రచించితిని. వాటి ముద్రణము విశేషవ్యయప్రయాస సాధ్యం బగుటచేతను; ఇతరుల తోడ్పాటు లేక నేనీ కార్యము సహా గ్రముగా నిర్వహింపఁజాలకుండుటను కవితాప్రియులగు భక్త జనులీ యుద్యమమునఁ దోడ్పాటొనర్పఁ గోరి మహాజనసమక్ష మున నీ విజ్ఞప్తి నొనర్పఁ బూనితిని. ఉదారులీ సత్కార్య మునఁ దోడ్పడి నన్నుఁ గృతార్థు నొనర్తురుగాత.

శ్రీరామసేవా గ్రంథమాలయందుఁ బ్రకటింపబడు గ్రంథములు

1. శ్రీరామ శతకము
2. వెంకటేశ్వర శతకము
3. మల్లికార్జున శతకము
4. నరసింహశతకము
5. రుక్మిణీ విజయము (5ఆశ్వాసములుగల భక్తి బంధురమగు ప్రబంధము)
6. ఆంజనేయశతకము
7. ఖండకావ్యముల సంపుటి
8. రామేశ్వర యాత్ర
9. ఘటికాచలక్షేత్ర మాహాత్మ్యము

ఇట్లు,

గ్రంథకర్త.